The First Telugu Bi-weekly in Andhra Desa. The only Telugu Newspaper for H. E. H The Nizam's Dominions.

# గోల్కొండ పత్రిక

ప్రతి సోమ, గురువారములు ప్రకటింపబడును

సం॥ చందా రూ ౭-౦-౦
అర్ధ ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతిక ౦-౧-౪

హైదరాబాదు, (దక్కన్.)

GOLKONDA PATRIKA

HYDERABAD, Dn. MONDAY 23-4-1934

ఒక వారము తరువాత ప్రాతపత్రిక కోరినచో వెలకు పరిమితి లేదు.

సంపుటము ౮ | శా.శ.౧౮౫౬ శ్రీభావనామసం॥ అధికవైశాఖశు॥ ౯ సోమవారము ౨౩-౪-౧౯౩౪ | సంచిక ౯౪

హాజరులు ప్రతిదినము ౨ అణాలు యివ్వవలసి వచ్చెను. గ్రామమునుండి బండిపై బయటికి వెడలుటే కష్టముగానున్నది.

## క్యాతూరులో గ్రంథాలయ స్థాపన

(ఒక విలేఖరి)

క్యాతూరు గ్రామమునందలి పెద్దలందరును ఈ వైశాఖ శు॥ పాడ్యమి శనివారమునాడు సాయంత్రము గ్రామ ధర్మశాలలోచేరి గ్రామాభివృద్ధికి విద్యావ్యాప్తి అవసరమని గ్రహించి ధర్మశాలలో పుస్తక భాండాగారమునకు అని ప్రత్యేకముగా నిర్మించిన భాగమునందు ఒక గ్రంథాలయము స్థాపించుటకు తీర్మానించిరి. గ్రామ యువకులు మిక్కిలి యుత్సాహముతో చందాదారులను చేర్చుకొనుచున్నారు. అనతికాలములో చందాధనము వసూలగును. అప్పటికప్పుడే కొన్ని గ్రంథములు సేకరింపబడినవి. గ్రంథ సంపాదన యత్నములు తీవ్రముగా జరుపబడును.

సుప్రసిద్ధులైన శ్రీయుత సురవరం రంగారెడ్డిగారు గోలకొండ పత్రికను, గ్రామాధికారులైన మారం నారసింహారెడ్డిగారు రయ్యతు పత్రికను నిచ్చుటకు దయతో నంగీకరించిరి. త్వరలో తదితర వార, మాసపత్రికలు తెప్పించుటకు ఏర్పాటులు జరుగుచున్నవి.

ఈ సందర్భమున ఒక ఆపరేషను నిమిత్తమై ఇచటికే వచ్చియున్న ఆలంపూరు మెడికలు ఆఫీసరైన శ్రీయుత డాక్టరు పత్రి నరసింహ్మ బింధు గారు సభ్యులను ఈసత్కార్య నిర్వహణకై ప్రోత్సహించిరి.

## పెండ్లి పౌరోహిత్యపు చిక్కు

(స్వ. వి.) కొత్తపల్లి, ౧౨-౪౩

౪-౭-౪౩ ఫసలీకి సరియగు భావ సం॥ చైత్ర బ॥ ౧౦ మి నాడు మిర్యాలగూడెం తాలూకాలో కొత్తపల్లియను గ్రామములో అల్లులజంగిరెడ్డి యిద్దిరెడ్డి, పుత్తూరు నర్సిరెడ్డి స్వగృహములలో వకేరోజు మూడు వివాహ మహోత్సవములు, జరుపుటకొరకై అదే గ్రామనివాసియగు వే॥ కాశీపల్లి రామకృష్ణయ్యను పౌరోహితమునకు పిల్వగా కొన్ని కారణములచే రానవీలు కలుగదనిరి. రు. ౨౫ పాయిలు యిచ్చెదమన్న వారు వప్పుకొనక రానందున సమాజమువారికి తెల్పగా ఆరాత్రి గం॥ ౯ లకు వివిధములగు వాద్యములతోడను, గీతాది నృత్యవినోదముల తోడను చక్కగా కలంకరింపబడిన వీధులవెంట జనబాహుళ్యము పిక్కటిల్ల ఊరేగింపు జయప్రదముగ సాగించి సమాజమువారినుంచి రు (౫) లకు వివాహకార్యములు జరిగెను. బ్రి॥ గొటిముక్కుల శ్రీకృష్ణపరబ్రహ్మం ఉపాధ్యాయులవారు హరికథా సంకీర్తనాదులతో పురప్రముఖులను ఆనందపరచిరి. పాశం నర్సిరెడ్డి గంజి మట్టయ్యగుప్త, శేఖుఖాజా గు॥ పటేలు తోడ్పడినందుకు ప్రశంసనీయులు.

## నారాయణపేటలో ప్లేగు

మహబూబునగరు జిల్లాలో నారాయణ పేటలో ప్లేగు తగ్గినది. తమ నివాసములను వదలిపెట్టిపోయినవారు తిరిగి యిండ్లను చేరుకొనుచున్నారు.

# పేరూరు విశేషములు

(విలేఖకుడు)

### గ్రామారోగ్యము.

మహబూబునగరం తాలూకాలోచేరిన మా గ్రామము నందు యీమధ్య ప్రబలిన మశూచివ్యాధిచేత ౨౦ మంది పిల్లలు ౧౦ మంది పెద్దవాండ్లును చనిపోయిరి. ౧౨౦౧ జనసంఖ్యగల మా గ్రామములో యింతమంది పిల్లలు చనిపోవుట భయంకరమగు విషయము. ఈ చనిపోయిన పిల్లలు అందరు టీకాలు పొందనివారే. మహబూబునగరము జిల్లా ఆరోగ్య శాఖాధికారులు యీవిషయమును గమనించెదరుగాక.

### ఎండలు

మనోరంజకమగు యీ వసంతఋతువునందే పగటిపూట యిప్పటికే ౧౧౭ డిగ్రీలు ఉష్ణము ప్రబలియున్నది. ఎండకాలము ముందు ఏమిచేయనున్నదో అని జనులు భీతిల్లుచున్నారు.

### పాడిపంటలు

ఈ సంవత్సరము మా ప్రాంతములలో పశువులకు గాల్లు చీడలు అనురోగములవల్ల చాలానష్టములు గల్గెను.

ఈ ప్రాంతముల పంట ఆరువీసములలో పునసే యున్నది. ఆ పండినపంటకైనను ధరలులేనందున పండిన పంటంతయు సర్కారుకిస్తులకే అమ్ముకొనుచున్నారు. దయామయులగు మా సర్కారువారు బీదరైతుల మొర నాలకింతురుగాక.

### అనుకరణము

మా గ్రామములో కొందరు పనిలేని పిల్లవాండ్రు గ్రామపెద్దల యాదర్శము గ్రహించి సత్కాలక్షేపమును అభిప్రాయముకాబోలు; యీమధ్యనొకరాత్రి నొకవ్యక్తి యింట జేరి పైకముపెట్టి పేక నాడ నారంభించిరి. ఒక్కొక్కరు క్రమముగా కూడు లేకున్నను కొన్ని గంటలలోనే రెండు మూడాయాల వరకు నష్టముపొందిరి. ఇంతలోనరకారు ముగు నకే నాకాలునిలిచి సదరు బాలురను గొని తలుపుమూసియున్న యింటిలో హనుమంతుని పూసించి యిటు ప్రవేశించెను. ప్రవేశించునరికి పిల్లవాండ్రు పుపాయముగా దీపమును ఆర్పిరి. ఆచీకటిలో ఆతడు చెబుతో తాండవ మాడెను. బాలురకు కొందరికి నొసళ్లపైనను ముక్కులపైనను కొందరికి భుజములపైనను చేతులపైనను లిగముద్రలంకితమయ్యెను. ఈ విషయము చిత్రగుప్తులవారు తమఖాతాలో వ్రాసుకొన గోరుచున్నారు. లేక వారు మేము వినుచున్నటుల నిజముగా సురవర స్థానమును పొందినచో దీనియొక్క ప్రతిని యమధర్మరాజులవారి కేమమణీయమునకు పంపగోరుచున్నాను

### మోసగాండ్రు

మా గ్రామమునకు సమీపమునగల మునుగాలు పేట గ్రామములో ఖతాలుబహాదురు అను నొకమహమ్మదీయుడు కలడు. ఆత్మకూరు సమస్థానములోచేరిన పరుమార్తి అను గ్రామములో సోమిరెడ్డిఅనువారొకరు కలరు. వీరిదగ్గర సాహెబుగారు బడిపంతులుగా ఉండెను. సోమిరెడ్డిగారు తమకు గృహనిర్మాణమునకు కలముకై సామానునిమిత్తము కొల్లాపురము వచ్చుచున్నట్లును తమకు సహాయమువలయుననియు నాగరకర్నూలు తాలూకాలోచేరిన జాగీరు కొండాపూర్‌పల్లి గ్రామములో వద్దిరాంరెడ్డిగారిపేర పుత్తరము వ్రాసినారని తెచ్చియిచ్చిరి. రెడ్డిగారు కొల్లాపురము అడవులలో సామాను చూపుటకు సోమిరెడ్డిగారిని ఒకరినిమాత్రమే రమ్మనిచెప్పిఅంపిరి. వారనుగొనిపోయినకొన్ని దినములలోనే కొన్ని బండ్లవెంటఆదేసాహెబువచ్చి తనకు సోమిరెడ్డిగారిబండ్లు ఎదురగుటచే తిరిగివచ్చితినని చెప్పెను. రాంరెడ్డిగారు స్వయముగా అనారోగ్యకారణమువల్ల సహాయార్థము వారివెంట పోజాలకపోయిరి. అంతకుముందే వారియింట వివాహమైనతొందరలో మరియొక్కరిని పంపజాలకపోయిరి. బండ్లుఅడవులలో ప్రవేశించెను; వారము దినములు అయినపిమ్మట మరలసాహెబుగారువచ్చి బండివెంటవచ్చిన మనుష్యులందరు వ్యాధితో బాధపడుచున్నారనియు రెండుయెడ్లుచచ్చినవని అనియు తెచ్చినపైకము ఖర్చుఅయినదనియు జరూరు ౨౦ రూపాయలు పంపవలయుననియు సోమిరెడ్డిగారిపుత్తరము తెచ్చెను. సోమిరెడ్డిగారివ్రాలు యిదివరకే చూచియున్నను వారిపేరుబట్టియు వారిఅవసరముబట్టియు ౫౦ రూపాయలు పుత్తరము తెచ్చిన బంట్రోతుకిచ్చిరి. తిరిగి వారి పైకము యొక్క దినములు అయినను తిరిగిరాకుండుటచేత బండ్లకొరకు వెదకుచుండగా మునుగాలుపేట ఖతాలుబహాదురు గారు ప్రత్యక్షమైరి. ఈసమాచారము అడుగగా సోమిరెడ్డిగారి పుత్తరములు సృష్టింపబడినవి అనియెరుకపడెను. కొందరుపెద్దమనుష్యులయొద్దనుండి కొంతపైకము యిచ్చియున్నారు. కావున యీమోసగానిగూర్చి మాప్రాంతీయులు తెలిసికొనియుండుట ముఖ్యావసరము.

## తగ్గింపుచందా

౧౩౪౩ ఫ॥ సంవత్సరము మొదటి నెల ఖుర్దాదు నెలలో క్రొత్తగా చేరు చందాదారులకు, సంవత్సరమునకు రు ౬-౦-౦ లకే మా పత్రిక పంపెదము మంచి సమయము. ఆలసించినచో తరువాత నిరాశచెందెదరు

వ్యవస్థాపకుడు

గోలకొండ పత్రిక

భావనామ సం॥ అధిక వైశాఖ శు॥ ౯

సోమవారము

# గోలకొండ సంవత్సరాది సంచిక.

7 వ మేయి 1934 (2 వ తీరు 1343) సోమవారమునాడు వెలువడును సంచికయందనేక ప్రత్యేక వ్యాసములు ప్రకటింపబడును రాజకీయ సాంఘిక చారిత్రిక విద్యావిషయకములగు పెక్కు వ్యాసములందుండును. కథలు ఇతర సారస్వత విషయక వ్యాసములు నందుండును నిజాము రాష్ట్రమును గురించిన ప్రత్యేకవ్యాసములుండును సంచిక సచిత్రముగానుండును

ప్రకటనలు వేయదలచువారికి మంచి తరుణము

ఈ సంచిక క్రొత్తచందాదారుల కుచితముగా పంపబడును ఇతరులకు పోస్టేజీగాక రు 0_8_0 లు (ఎనిమిది అణాలు)

మేనేజరు
గోలకొండ పత్రిక

# విమానము - రేడియో

మన ప్రభుత్వమువారు మన రాష్ట్రమునకు విమాన ప్రయాణ సౌకర్యముల నేర్పరుచ వలయుననియు రేడియో ఏర్పాట్లను చేయవలయుననియు అతి కుతూహలురై యున్నట్లు స్పష్టముగా కనబడుచునేయున్నది ఈ కుతూహలమునకు అనుకరణమే మొదట ప్రోత్సాహము నిచ్చియుండెనని ఊహింపవచ్చును ఇప్పుడు దేశదేశములన్నియు విమానములను ఎక్కువగా ప్రేమించుచున్నవి ఇండియాలో కూడ జరిగిన కొలదిసంవత్సరములలో విమానములయందు అభిరుచి చాలాయెక్కువైనది ప్రభుత్వమువారు ప్రస్తుతము టప్పావిమానమును నిర్వహించుచున్నారు ఇదేవిధముగ బొంబాయి, కలకత్తా సంయుక్తరాష్ట్రము మొదలగు రాష్ట్రములు రేడియో సౌకర్యముల ననుభవించుటకై ప్రయత్నముల చేయుచున్నవి ఈరాష్ట్రములను దేశములను జూచి మన ప్రభుత్వమువారును ఈ ఏర్పాట్లను మనరాష్ట్రమునకు సంపాదించి ప్రఖ్యాతిపొంద జూచుచున్నట్లున్నది

విమానములును రేడియోలును మానవుని సుఖమును ఎక్కువజేయుటకు సహకారులేగాని ప్రస్తుతము మనరాష్ట్రమున నవి అత్యంతావసరములా? ఇంతకంటె ఎక్కువ అవసరములైన వాటిని మనరాష్ట్రమెంతవరకు అనుభవించుచున్నది? తక్కువాటికంటె ముందువీటికి ప్రభుత్వమువారు ద్రవ్యమును వ్యయముచేయుటవలన ఎక్కువలాభమా అనువిషయములన్నియు ముందాలోచించ బడవలయును

ఈ ఆలోచనలనుబట్టి చూచినచో మన రాష్ట్రము ప్రస్తుతము శీఘ్రముగా ఈక్రొత్త సౌకర్యములకై ఖర్చును ఆమోదించునని మేముతలంచజాలము రాష్ట్రమందు ఒకప్రదేశమునకు మరియొక ప్రదేశమునకు సంబంధము నెక్కువజేసి విజ్ఞానమును ఒకభాగమునుండి మరియొక భాగమునకు వ్యాపింపజేయుటకును, రాకపోకలకును, వ్యాపారము విరివిగాను సరళముగాను జరుగుటకును విమానము—రేడియో సాధనములు ఈ ప్రయోజనములు మరియొక చౌకవిధమున సాధ్యములు కావా? రాకపోకల వసతులను గూర్చి విచారించుదము ఇదివరకొకసారి మేము చెప్పినట్లు ప్రస్తుతము మనరాష్ట్రమున ప్రతి ౧౫ చదరపు విస్తీర్ణమునకు ఒకమైలురోడ్డును, ప్రతి ౧౦౪ చదరపుమైళ్లకు ఒక్క టప్పాకార్యాలయమును మాత్రమేగలదు ఇదేవిధముగా ప్రారంభింపబడి కొంతవరకు వృద్ధిజెందింపబడిన రైలు పర్పాట్లలోను ఇంకను వృద్ధిగావలసిన దెంతయోగలదు ఈప్రారంభించిన విధానములన్నియు ఇట్లు కొరవలడియుండగా క్రొత్తవాటికి పూనుకొనుటకు అంత అవసర మేమివచ్చెను? అప్పట్లో సామాన్యజనమునకు ఎక్కువగా అందుబాటులోనుండునది రోడ్ల సౌకర్యముగాని విమాన సౌకర్యముగాదు కాబట్టి మనరాష్ట్రమందు తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభము సాధింపవలయునన్న విమాన సౌకర్యములకు పెట్టదలచిన వ్యయమును మొదట రోడ్డు రైల్వే ఏర్పాట్లకై వినియోగించుట మంచిదని మాయభిప్రాయము

ఇందులో ఇంకొక విషయముగలదు రోడ్లను రైలుయేర్పాట్లను టప్పా సౌకర్యములను వృద్ధిచేయుటలో ఎంతమందికి జీవనోపాధిలభించునో అంతమందికి విమానపు ఏర్పాట్లవలన లభించదుకదా! ఈమొదటి ఏర్పాట్లవలన దేశమునందు రాకపోకలు వ్యాపారము అభివృద్ధిజెంది ప్రజలు ఇప్పటికంటె శీఘ్రయానములు అవసరములని తలచునపుడు వాటిని సమకూర్చుట ఎక్కువలాభకరము.

——

## స్థానిక వార్తలు

### హైదరాబాదులో రేడియోస్థాపనము

ప్రభుత్వకార్య నిర్వాహకవర్గ సభ్యులు ముగ్గురకలిసి ఆక్సుడు హైదరీగారు ఫైర్ కింగ్ గాగలిగిన ప్రాడ్ కాస్టింగు స్టేషనియమింప బడుటతో రేడియోస్థాపక సూచకకార్యదూతము చాల్చెనని యే చెప్పవచ్చును పోస్టువాటి మాదులకులు ఇందుకై ఖర్చుపెట్టవలెనని నైజాము ప్రభుత్వము వారికి తెలిపిరి

రేడియోస్థాపన వ్యాపక విషయమందు రేడియో శాస్త్రపరిజ్ఞానముగల రైల్వే యాపరిండెంటగు మహబూబ్ అలీగారి అభిప్రాయము ముఖ్యముగా కనుగొనబడెను,

ప్రస్తుతాలోచనల ప్రకారము, ముఖ్యకార్యాలయము హైదరాబాదును, ఇతర కార్యాలయములు వరంగల్లు, గుల్బర్గాలలోను స్థాపించబడి వాటిమూలముగా ప్రసారమున కంతము ఇంగ్లీషు తెలుగు రేడియోకార్యక్రమములు బ్రాడ్‌కాస్టు చేయబడును (అ ప్రె.

సికింద్రాబాదు, ఏప్రిల్ ౨౫——

ప్రభుత్వ కార్యనిర్వాహక వర్గమువారు బోర్డువారు చేసిన సూచనల నామోదించి నైజాముగారి అనుమతికై పంపిరి జరుగుచున్న ఫసలీ సంవత్సరము అంతముకాకముందే ఈ రేడియోవిధాన మాచరణకు రావచ్చును (స్వ. వి.)

## నిజాంరాష్ట్ర గోధుమపంట

౧౩౪౩ ఫ॥ రెండవ మెమోరాండము

(ఆగ౩౦_౩౧ తో అంతమగు ౫ వీంట్లలో ఈరాష్ట్రములో గోధుమపంట కిందనుండు విస్తీర్ణము ఇండియాలో మొత్తము మీదగోధుమ పైరు చేయబడుభూవిస్తీర్ణములో ౧౦౦౦౦ కు ౩౩౪ లెక్కనున్నవి,

నివేదికకాలములో గోధుమ పైరు చేయబడిన భూమి ౧_౩౩౦౩౭_౨ ఎకరములుగలదని అంచనా వేయబడినది గతసంవత్సరమదేకాలములో ౧౩౩౪౦౫౫ ఎకరాలుండెను అనగా ౧౦౩౬_౭౩ ఎకరాలు నివేదన కాలములోతగ్గెను అనగా ౧౦౦౦౦ఎకరములకు ౭౭౩ ఎకరములతంతున తగ్గినదియర్థము, అయినను మొదటఊహించిన దానికంటె రెండవసారి అంచనా ౭౧_౭౭౩ ఎకరములు లేదా ౧౦౦౦౦కు ౧౫౬ లెక్కన హెచ్చినదన్నమాట ఈతగ్గునలకు బీదరు, పర్భని, గుల్బర్గా జిల్లాలలో కొన్ని తాలూకాలనుండి లెక్కలు ఇంకను రాకుండుట కారణము అంతేగాక ఔరంగాబాదు, ఉస్మానాబాదు రాయచూరుజిల్లాలలో అక్కడక్కడ శీతము హెచ్చుగానుండుటచేతను బీదరుజిల్లాలో ఎలుకలవలను కొద్దిగాహానియైనది ఈమాక్రమముల్ని లెక్కనచోట్లలో బాగున్నది ఎంతపండునది అంచనా ఈ[illegible] తెలుపబడును

### రెడ్డిహాస్టలులో అష్టావధాన

౧౯౩౪ ఏప్రిలు ౧౫ వ తేది ఆదివారము సాయంకాలము ౫ గంటలకు రెడ్డిహాస్టలులో మ రా శ్రీ వీరంభట్ల రెడ్డిగారు (కడపజిల్లా వాస్తవ్యులు) అష్టావధానము జయప్రదముగా చేసి సభ్యులనానందపరచిరి మ రా రా మా హనుమంతరావుగారు అధ్యక్షతవహించిరి సభనలంకరించినవారిలో శ్రీయుత రాజాబహద్దరు కొత్వాలు వెంకటరామారెడ్డిగారును దేశభక్త వామనరాంచంద్ర నాయకు గారును యమ్ యమ్ రెడ్డిగారును బూర్గుల రామకృష్ణారావుగారును శ్రీ ముత్యపు కాపరెడ్డిగారును ముఖ్యులు.

ఈ అవధానములో ఇచ్ఛావర్ణనయు. నిషిద్ధాక్షరియు దత్తాక్షరియు, గంటలును, సమస్యలును అప్రస్తుత ప్రశంసయు గలవు

అప్రస్తుత ప్రశంసలో హరిశ్చంద్రారెడ్డిగారిచిన సభలో కొంత ఉత్సాహముగానుండెను సభికులందరు అష్టావధానిగారిని చాలాసమర్థులని మెచ్చుకొనిరి.

## నైజాముగారి కుమారుడు

### సేనాధిపతిగ నియమింపబడుట

హైదరాబాదు నైజాముగారి పెద్ద కుమారుడును యువరాజును అగు ఆజంజాగారిని నైజాము సైన్యములకు ప్రధానసేనాధిపతిగ నియమించిరని యూథిగ తెలిసెను ఆజంజాగారు కాశ్మీరుమండి రాగానే ఉద్యోగము స్వీకరించుదురు

పరిపాలకుని ప్రథమపుత్రుని సేనాధిపతిగా నియమించుటకు యుదిరియే ప్రథమము ప్రజలుయందుకు సంతసించుచున్నారు కర్నలుపి ఆర్ వి శేషగానును, నవాబుసయ్యదు యార్జంగుగారును, వారికి మిలిటరీ సహకారులుగ నియమింపబడుదుర

### పందితో పోరాటము

సికింద్రాబాదు సమీపములోనున్న పోమారంలోనొకపొలములో బాలుడ్యుల్తొకరు కుక్క ఆడుకుండగా పోరాడెను, అది కప్పించుకొలేదని బాని దుడ్డుకర్రతో కొట్టెను కాని అదిపరుగెత్తి అతనిని కరచుచుండెను ఇంతలో అతని సోదరుడును కదలతరులునవచ్చి అతనిని కాపాడిరి. అతడిప్పుడు క్రిస్టోనియన్నారు. కుమారంతయు గాయములమయమై యున్నది స్వస్థత పరుచుచున్నారు అడవిపందిని కలవర్లో గౌకరు హాకి గుండుదెబ్బ తగిలియున్నదట,

### పాతిపెట్టినవిగ్ర హముకోట

[illegible]

